శ్రీ

# కృష్ణతత్త్వ శతకము

గ్రంథకర్త:

పుచ్చా వేంకటకృష్ణశాస్త్రి, బి. ఏ., బి. ఇడి.,
ఫస్టుగ్రేడ్ వకీలు, తెనాలి, గుంటూరుజిల్లా




: పబ్లిషర్సు :
వేంకట్రామ అండ్ కో.,
విజయవాడ - సికింద్రాబాదు

1957



[మూల్యము 50 న.పై.



గ్రంథకర్త:

శ్రీ పుచ్చా వేంకట కృష్ణశాస్త్రి బి. ఏ., బి. ఇడి.,

ఫస్టుగ్రేడ్ వకీలు, క్రొత్తపేట - తెనాలి

# పీఠిక

ప్రస్తుతకాలమున సంస్కృతభాష పూర్వముకంటె జాల క్షీణించినది. ఉపనిషదాది వేదాంత గ్రంథములన్నియు సంస్కృతమున విరాజిల్లుచున్నవి. వానియర్థ మందఱకు సుబోధక మగుట లేదు. అందుచే భగవంతుఁ డున్నాఁడా లేఁడా యను సందేహము, ప్రపంచమునందున్న విషయములయం దిచ్ఛయు, కామక్రోధాదులకు లోనై సంచరించుటయు, జన సామాన్యమున కజ్ఞానమువలనఁ గలిగినవి. పైవానిం బ్రతిఘటించుట కీ గ్రంథము చాల ననుకూలించుచున్నది. సాకారముగానున్న దేవతల కావాహనాద్యుపచారములు తేటతెలుఁగున నందఱకు సుబోధకమగునట్లు రచింపబడినవి. అవి మానసికముగనుక పూజయందర్థమును దెలిసికొని మనసు నిష్టదేవతయం దేకాగ్రముచేయుటకు ధ్యానసాధనముగ నేర్పఱుపఁబడినవి. జన సామాన్యము తన యజ్ఞానమును దెలిసినఁగాని జ్ఞానావాప్తికి మనసునఁ దీవ్రబుద్ధి నెలకొనదను భావముతో నజ్ఞాన నరునిరీతి కొన్ని పద్యములచేఁ దెలుపఁబడినది. భగవంతుఁడు, ఆయన మహిమ, ఆయన నుపాసించినందువలన జనులకుఁ గలుగు లాభము తెలియఁబడిననేగాని భగవంతునివైపు మనసు తిరుగదను నభిప్రాయముతో శాశ్వతమైన బ్రహ్మస్వరూపము కొన్ని పద్యములలోఁ గూర్పబడినది. అజ్ఞానమునకుఁ గారణమగు విషయబద్ధతయు, దాని కనువగు బ్రపంచ రచనయుఁ దెలియనిది మన సేకాగ్రత చెందుట కవకాశము కలుగదను బుద్ధిచేఁ బ్రపంచ తత్త్వమును, భగవ దారాధనవలనఁ గలుగు లాభములును గొన్ని పద్యములచే విశదీకరింపఁబడినవి.

ఈ శతకములోని పద్యములు 172. నూటడెబ్బదిరెండు అను సంఖ్యలో 1, 7, 2 అను అంకెలున్నవి. ఈ అంకెలను కూడగా 10 వచ్చినది. పదిలో 1 అను అంకెయున్నది. ఒకటి అనగా బ్రహ్మస్వరూపము వంటిది. ఎప్పటికిని నాశము లేనిది. ఆ ఒకటి అయిన

బ్రహ్మస్వరూపమునుంచి సమస్త వస్తుజాలము లెట్లు పుట్టెనో, ఆ విధముగా ఒకటికి ఇంకొకటి కలుపగా రెండగును. ఈ విధముగా సంఖ్యలన్నియు పుట్టెను. కాన ఒకటి అనునది అత్యంత శక్తి మంతము. శూన్యములో ప్రపంచము లేదు. బ్రహ్మస్వరూప మును తెలుపుటకీ విషయము చెప్పబడినది. నేను వ్రాసిన పద్యములు 172 అయినవి. నేనటుల 172 గా వ్రాయలేదు. వ్రాసిన సంఖ్యనుబట్టి తేలిన విషయము తెలుపబడినది.

క. ధ్యానమునకుఁ బూజయు న
జ్ఞాన నరుస్థితియు సర్వ ♦ కారణ పరమే
శాను ని మహిమయుఁ దత్త్వము
నేనిప్పుడు వరుసఁ దెలుప ♦ నెంచితి నిందున్.

క. ఎక్కువగా నీ గ్రంథము
చక్కని ముక్తికిని దారి ♦ సరగునఁజూపున్
బెక్కులు సందేహంబులు
నిక్కముగా దీఱు దీని ♦ నిత్యముఁ జదువన్.

ఇట్లు
గ్రంథకర్త.

శ్రీ 'శాస్త్రరత్నాకర' 'తర్క-వేదాంతసార్వభౌమ'

## బ్రహ్మశ్రీ మండలీక వేంకటశాస్త్రి గారి

## యభిప్రాయము

శ్రీ కృష్ణాయ నమః

శ్రీపుచ్చా వేంకటకృష్ణశాస్త్రిగారు శ్రీకృష్ణ తత్త్వశతక మనుపేరున రచించిన 172 కంద పద్యములను చూచినాను. అందు సగుణనిర్గుణ బ్రహ్మతత్త్వములను భక్తులుభావనచేసికొనుటకును, తత్త్వదృష్టికలవారలు చక్కగ విచారణసల్పుకొనుటకును అనువగురీతిని శ్రీ శంకరభగవత్పాద కృత వివేకచూడామణి మొదలగు గ్రంథములందలి భావముల నిమిడ్చి యున్నారు. కాన జనులందఱు దీనిని పఠించి శ్రీకృష్ణభక్తిని పెంపొందించుకొని కృతార్థులగుదురుగాక! తనకు, ప్రపంచమునకు నుపకరించునట్టి ఇట్టిగ్రంథమును రచించిన శ్రీ శాస్త్రి గారిని శ్రీకృష్ణభగవానుఁడు సర్వాభీష్టముల నొసంగి రక్షించుగాక!

ఏలూరు,<br>18—9—57.

ఇట్లు,<br>మండలీక వేంకటశాస్త్రి.

శ్రీ శివాయ గురవే నమః

# పండితాభిప్రాయము

క. అందమ్ముల కందములగు
కందమ్ముల ధ్యానమాదిగా నుపచారా
లందఱకుఁ దెలియఁదెలిపెఁ
బొందికగా 'కృష్ణ' సుకవి బుధమణి కృష్ణా!

క. మ్రానగు నజ్ఞానమ్మును
మానుపు జ్ఞానమ్మరూపు మానగు శైలిఁ
తేనియ నుడులన్ దెలిపెఁ
తా నీతోఁ 'గృష్ణ' సుకవి ధన్యుఁడు కృష్ణా!

క. పుచ్చారామస్వామి బు
ధోచ్చయు కొమరుండు శమదమోపేతుఁడు నీ
మెచ్చుగ మహిమస్తోత్ర
మ్మచ్చుపడం 'గృష్ణ' సుకవి యమరిచె కృష్ణా!

క. హరితత్త్వం బీ సర్వము
పరికింప నటంచు నుభయభాషాపదబం
ధుర మధుర రచనఁ దెలిపెఁ
సరసమ్ముగఁ 'గృష్ణ' సుకవి శౌరీ! కృష్ణా!

ఇట్లు
చల్లా పిచ్చయ్యశాస్త్రి, శతావధాని
ఆంధ్రజయదేవ
మన్మథ కార్త్తిక బహుళదశమీ గురువారము

# ప్రశంసాభినందనము

క. విమలతఁగనె నీదతవం
శము వేంకటరావుగారి జననంబున వా
రిమహిమ హెచ్చెను సుతర
త్నము వేంకటరామసుమతి తనరుటవలనన్.

క. వీరలు సుజ్ఞానమహో
దారులు; శాంతులు; విశుద్ధ ధర్మపరులునా
వీరి సుధర్మమ్ములు నిల
సారముగని తెలుపుటకు నసాధ్యమ్మయ్యెన్.

క. కష్టము ధనసంపాదన
కష్టతరంబగును తానుగని పెంపొదవన్
కష్టతమ మిలను ధర్మము
సుష్ఠుగ పైమూటి గనిరి సుమతులు వీరల్.

శ్రీ పరమేశ్వర ప్రేరణచే రచింపఁబడిన నా యీ ప్రథమ రచనమగు గ్రంథమునుజూచి గౌరవించి తమ ఆదరాభిమానములతో తమ ముద్రణాలయమున ముద్రింపించి పాఠకలోకమునకు నందజేసిన మహోదారులును, భక్తశిఖామణులు నగు శ్రీ ఈదర వేంకట్రావు పంతులుగారిని, వీరి పుత్రరత్నమగు శ్రీ వేంకట్రామయ్యగారిని పరమేశ్వరుఁడు ఆయురారోగ్యైశ్వర్యము లొసంగి కాపాడుగాక యని కోరుచున్నాను.

ఇట్లు,
గ్రంథకర్త

శ్రీ రామాయ నమః

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీ కృష్ణతత్త్వ శతకము

క. శ్రీ వక్షస్థల ! కేశవ !
శ్రీ వైష్ణవ హృన్నివాస ! శ్రితజనపోషా !
శ్రీ వేంకటాద్రినిలయా !
శ్రీ వాగీశాదివినుత ! శ్రీ శ్రీ కృష్ణా ! 1

క. నీ శరణుసొచ్చి మది స
ర్వేశుఁడవని నిన్నుఁదలఁచి విబుధ హితమతినై ల
క్ష్మీశునిఁ గృతిపతిఁ జేసితి
నాశరహిత ! కావుమయ్య నను శ్రీకృష్ణా ! 2

క. కావుము నను సదయుఁడవై
కావింపుము నన్ను సరస కవివర్యునిఁగాఁ
గోవిదులు మెచ్చఁ దిరముగఁ
బ్రోవుము మత్కృతిని భువనపోషక ! కృష్ణా ! 3

—♦ ప్రణవోచ్చారణము ♦—

క. ఓంకారము నీవని మును
లోంకారజపమ్ముఁ జేసి యురుపదయోగా
లంకారులైరి కేశవ !
శంకారహితముగ నన్ను సాకుము కృష్ణా ! 4

## —♦ భూతోచ్చాటనము ♦—

క. ఒనర శుభారంభములను
గొనసాగింపంగ విఘ్నకూపము నాశం
బును సలిపి నాకు సౌఖ్యము
మనసారగ నీయుమయ్య మాధవ! కృష్ణా! 5

## —♦ శ్రీకృష్ణమానసపూజాప్రారంభము ♦—

## —♦ ధ్యానము ♦—

క. రవికోటితేజ! సుందర!
రవిశశినేత్రా! సుగాత్ర! రాక్షసహరణా!
నవనీతచోర! వామన!
భువి నిను భావింతు దీనపోషక! కృష్ణా! 6

## —♦ ఆవాహనము ♦—

క. గజరక్షణ! దీనావన!
అజశరముఖవినుత! నిన్ను నావాహనమున్
సుజనులు మెచ్చఁగఁజేయుచు
భజియించెదఁ గావ నీదె భారము కృష్ణా! 7

## —♦ ఆసనము ♦—

క. అంతటనిండిన నిన్నున్
జింతలఁబాపంగ నాదు చిత్తాబ్జమునన్
సంతతమాసీనునిఁ గా
వింతును శుభములను నిమ్ము వేగమె కృష్ణా! 8

—♦ పాద్యము ♦—

క. ఆద్యంతహీన! మునిహృ
ద్వేద్య! భవత్పాదములను దివ్యంబగు నీ
పాద్యమునఁ గడిగి తుడిచెద
సద్యస్సుఖమొసఁగి కరుణ సాకుము కృష్ణా! 9

—♦ అర్ఘ్యము ♦—

క. సురవర మునినుత! మురహర!
సురుచిరపింఛావచూడ! శుభకర! ధరణీ
ధర! నీకు నర్ఘ్యమిచ్చెదఁ
బురుషార్థసుఖంబులొసఁగి ప్రోవుము కృష్ణా! 10

—♦ ఆచమనీయము ♦—

క. బంగారు పళ్లెరంబున
గంగోదకహేమపాత్ర గైకొని మది యు
ప్పొంగఁగ నాచమన మ్మొసఁగ
రంగా నర్పింతుఁ గావ రమ్మిఁకఁ గృష్ణా! 11

—♦ మధుపర్కము ♦—

క. దధిమధ్వాజ్యములనుగొని
విధి నెఱిఁగిన వేదశాస్త్రవిదులు నుతింపన్
మధుపర్కము నీ కొసఁగెద
నధికాయుష్మంతుఁ జేయు మా నను గృష్ణా! 12

—◆ అభిషేకము ◆—

క. గంగాధునీ పవిత్ర త
రంగోదక నారికేళ రసగోక్షీరా
భంగాభిషేకముల స
న్మంగళ మార్జనల నీకొ నర్చెదఁ గృష్ణా! 13

—◆ వస్త్రధారణము ◆—

క. మెత్తని పీతాంబరములు
క్రొత్తగ తేఁబడిన యీ దుకూలము నీకై
యిత్తును వానిధరించుచు
నుత్తమగతులొసఁగి నన్ను నోముము కృష్ణా! 14

—◆ శ్రీచూర్ణధారణము ◆—

క. మేలగు తిరుచూర్ణముతో
వాలుగ నామముల హృదయ బాహుముఖములన్
వీలుగ దిద్దితి నన్నిఁకఁ
బాలన చేయుటకు నీదె భారము కృషా! 15

—◆ యజ్ఞోపవీతధారణము ◆—

క. రీతిగ దామోదరునకు
నూతనమగు జందెముల నకనూనపుభక్తిన్
ప్రీతి నొసంగెద సుప్ర
ఖ్యాతునిఁ గాంచి నన్నుఁ గావుము కృష్ణా! 16

—♦ గంధధారణము ♦—

క. శ్రీగంధ చందనాగురు
సౌగంధిక వివిధవస్తు సంచయములతో
భోగంబుఁ గూర్తు నీకను
రాగంబున నన్నుఁగావ రమ్మిటు కృష్ణా! 17

—♦ హరిద్రాక్షతధారణము ♦—

క. అక్షరరూపుని నిను మ
ద్రక్షకునిఁగ నమ్మి మదిని రయముగను హరి
ద్రాక్షతలిడి యర్చింతు స
లక్షణునిం జేయఁగావలయు నను కృషా! 18

—♦ కుంకుమ విలేపనము ♦—

క. సంకోచము లేకుండగ
సంకటములఁ బాపి సౌఖ్య సంతతి నిడఁగం
గుంకుమపూజను జేసెద
పొంకముగా నన్నుఁగాచి ప్రోవుము కృష్ణా! 19

—♦ పుష్ప పూజ ♦—

క. మల్లెలు తులసీదళములు
మొల్లలు జాజులు గులాబిములుగోరంటల్
ఎల్లను గొని పూజించెద
నుల్లములో నిలిపి నిన్ను నొప్పుగఁ గృష్ణా! 20

## ధూపాఘ్రాణము

క. అలరఁగ సాంబ్రాణియు గు
గ్గిల మగురును జేర్చి ధూపసత్కృత్యము నీకున్
సలిపెద నవిరళ సౌఖ్యో
జ్జ్వలునిఁగ ననుఁజేయుమయ్య సతతము కృష్ణా! 21

## దీపదర్శనము

క. ఆపన్నరక్ష! గోఘృత
దీపంబుల నిడుదు నీదు దీవెనలందన్
దీపింపజేసి జ్ఞానముఁ
బాపం బెడలింపుమయ్య భయహర! కృష్ణా! 22

## నైవేద్యము

క. నన్నిఁక రక్షింపుము రా
జాన్నము సూపంబు శాక మాజ్యము దధి చి
త్రాన్నము భక్ష్యాదికమున్
జెన్నుగ నిన్నారగింపఁ జేసెదఁ గృష్ణా! 23

## తాంబూల సమర్పణము

క. దక్షిణతోఁ దాంబూలము
రక్షణకై యిచ్చుచుంటి రాధాలోలా!
అక్షర! యైశ్వర్యములను
నక్షయముగ నాకు నొసఁగుమయ్యా! కృష్ణా! 24

—♦ నీరాజనము ♦—

క. ఆరాధించుచు మదిలో
నీరాజన మిచ్చువాఁడ § నేర్పున నేఁ గ
ర్పూరోజ్జ్వల దీపావళి
గారాబముతోడ నన్నుఁ § గావుము కృష్ణా! 25

—♦ మంత్రపుష్పము ♦—

క. అక్షత సుమపల్లవముల
దక్షిణతో మంత్రపుష్ప § దానము నే మం
త్రాక్షరయుతముగఁ జేయుదు
రక్షింపఁగ నన్ను వేగ § రమ్మిఁకఁ గృష్ణా! 26

—♦ అన్నదానము ♦—

క. భూసురులకు బీదలకును
వాసిగ భక్ష్యాజ్యచోష్య § పరమాన్నములన్
జేసెద సంతర్పణమును
వాసిని గనజేయుమయ్య § వసుధను కృష్ణా! 27

—♦ నృత్యగీతాదికము ♦—

క. భజనలఁ జేయుచు మదిలో
సుజనులతో నృత్యగీత § శుభశబ్దములన్
నిజమైన భక్తిగొలిచెద
గజరాజవిమోక్ష! నన్నుఁ § గావుము కృష్ణా! 28

—♦ ప్రదక్షిణము ♦—

క. అక్షయ చేతులు మోడ్చి ప్ర
దక్షిణ మొనరింతు భక్తి ౯ తాత్పర్యములన్
రక్షణదక్షా ! నాకు న
నుక్షణము సుఖంబు నిమ్ము ౯ నుతగుణ ! కృష్ణా ! 29

—♦ నమస్కారము ♦—

క. పాపిని పాపస్వాంతుఁడఁ
బాపములొనరించి యిట్లు ౯ పారవ్యథలన్
రాపిడిఁ జెందుచు నిదె నీ
ప్రాపును జేరితిని గావ ౯ రమ్మికఁ గృష్ణా ! 30

—♦ ప్రసాదస్వీకారము ♦—

క. ఇలనుండు భోజ్యములనేఁ
దొలి నీ కర్పణము చేసి ౯ తుది భుజియింతున్
ఫలకర్తృతా క్రియాదిక
ముల కన్నిటికిని నీవె ౯ మూలము కృష్ణా ! 31

—♦ అపరాధ స్తవము ♦—

క. తెలియకచేసిన పాపము
తెలిసియుఁ దెలియకయ చేయ ౯ దీఅని యఘముల్
తెలిసియుఁ జేసిన పాపము
విలయముగావించి ప్రోవవే ౯ నను గృష్ణా ! 32

క. తెలియని విధిహిత కర్మలఁ
దెలిసికొనన్ లేదు నాకుఁ దీరిక, యిఁక నేఁ
దెలిసిన విధులను జేయఁగ
నెలకొన దీ బుద్ధి శరణు నీవే కృష్ణా! 33

క. ఇప్పుడు సుఖముగ నుండు నొ
కప్పుడు కష్టముగనుండు నయ్యా! హృదయం
బెప్పుడు సుఖముం గనునటు
లొప్పుగ వరమిమ్ము దైవతోత్తమ! కృష్ణా! 34

క. చేసితి బహుపాపంబుల
మోసితి తజ్జన్యభారముల నధికముగా
రోసితి దుఃఖాదులచే
గాసిని బడనీక నన్నుఁ గావుము కృష్ణా! 35

క. పాలింపుము సదయుఁడవై
చాలింపుము కోపమింకఁ జయ్యన నాపై
నాలింపుము నా మొఱ ను
న్మూలింపుము నాదు పాపముల దయఁ గృష్ణా! 36

క. వేకువ నీటను మునిఁగి వి
వేకముతో సాంధ్య హోమవిధులను జేయన్
లేక చరించితి నీవే
నాకిఁక దిక్కనుచు నమ్మినాఁడను గృష్ణా! 37

క. నీపదముల నెదఁ దలఁచిన
నాపదలను ద్రుంచి సంతతైశ్వర్యములన్

ప్రాపింపఁజేయుదని నీ
ప్రాపును జేరితిని భువనరక్షక! కృష్ణా! 38

క. ప్రోవఁగ నిల నీవేయను
భావము నిశ్చలత నిలిపి భజియింతు మదిన్
దేవతలకు దేవుండవు
కావుము సదయుండవగుచుఁ గరుణను గృష్ణా! 39

క. ఖలుఁడను ఖలచిత్తులలో
బలవంతుఁడఁగాను నేను బాదరసమటుల్
చలియించెడు నింద్రియముల
నిలుపఁగ నిఁక నేమి సేయనేర్తును గృష్ణా! 40

క. మహిమోన్నతుఁడవు నీదగు
మహిమల వినుతించు ముఖ్యమార్గములందున్
విహరించు భాగ్య మిచ్చుచు
నహరహమును నన్నుఁ గావుమయ్యా! కృష్ణా! 41

క. నా పాపగిరులు కూలఁగ
నేపారినభక్తి వినయమెసఁగ శిరముతో
నీ పాదములకు మ్రొక్కితి
గాపాడుము నన్ను నమితకరుణను గృష్ణా! 42

క. కన్నులతో నీరూపము
నెన్నఁగ నెల్లెడలఁ గనఁగ నీయిలలోనే
నన్నెము నెఱుగనివిధమును
జెన్నుగ నా కమరునటులఁ జేయుము కృష్ణా! 43

క. నా చెవుల కహర్నిశమును
నీ చరితమె వినెడు వేడ్క నెలకొనునట్టుల్
నీచపుఁబలుకులు వినమి వి
వేచనము ఘటింప నిన్ను వేఁడెదఁ గృష్ణా ! 44

క. నీ మహిమలు పలుకుచు నీ
నామము నెప్పుడు స్మరించు నైసర్గికమా
నేమ మొసంగుము నాకని
వేమఱు నేఁ జేయుమనవి వినుమిదె కృష్ణా ! 45

క. చేతులు గలందులకు నీ
భూతలమున నీవు తృప్తిఁ బొందెడుపనులన్
బ్రీతినిఁ దెలిసి యొనర్చెడు
నీతిని నా కమరఁజేయు నిత్యము గృష్ణా ! 46

క. ఇల విషయంబులలోఁబడి
పలువిధములఁ దిరుగు నాదు పదములు నీసే
వలకొఱకుఁ దిరుగు తెఱఁగున
నెలకొల్పుచుఁ గావుమయ్య నీవిఁకఁ గృష్ణా ! 47

క. జూదము చీట్లాట వివా
దాదులచే నింతకాల మరిగెను నాకున్
నీదయఁ బడయఁ దపోనియ
మాదుల నాబుద్ధి నిలుపుమా యిఁకఁ గృష్ణా ! 48

క. శైశవమున మలమూత్రపు
రాశిని దొరలుచు వివేక రహితుఁడనై నీ

వే శరణమంటి నిప్పుడు
నాశరహిత ! కావుమయ్య నన్నుఁ గృష్ణా ! 49

క. బాలుఁడనై క్రీడాదులఁ
గాలము చాంచల్యవృత్తిఁ గడపితిఁ గావన్
జాలుదువని నినువేఁడితి
జాలము సేయకయె నన్ను సాకుము కృష్ణా ! 50

క. యౌవనమున విషయేచ్ఛలఁ
గావరమునఁ దిరిగి తిరిగి కామవశత నీ
సేవను మఱచితి నన్నుఁ
గావుము నిన్నెదను దలఁతు ఘనముగఁ గృష్ణా ! 51

క. వృద్ధుఁడనై మరణమునకు
సిద్ధమయినవేళ నీదుసేవను జేయన్
బుద్ధిజనించునె ! యిప్పుడె
శ్రద్ధగఁ బూజింతుఁగావ రమ్మికఁ గృష్ణా ! 52

క. ధనసంపాదనమే ఘన
మని పలుబాధలను జెంది యాశాభంగం
బును బొంది విసివి వేసరి
నినుఁ జేరితి, నన్నుఁగావ నీవే కృష్ణా ! 53

క. ధనవంతుఁడనై నను ని
ర్ధనుఁడనుగా నున్న, నీచకేతనువున జన్మం
బును బొందిన నీపదసే
వను మఱవనిరీతి నిమ్ము వరమిఁకఁ గృష్ణా ! 54

క. ఎంతగ ధనములభించిన
నెంతగ సంసారసౌఖ్య ꠋ మేర్పడియున్నన్
స్వాంతమున నిన్నుఁ దలఁపక
శాంతినిఁ బొందంగఁజాల ꠋ శరణిదె కృష్ణా! 55

క. అడిగిన వరముల సంతస
మడరఁగ నొసగూర్పఁజాలు ꠋ నధిపతి విల నే
బడు బాధల నన్నింటినిఁ
బడఁగూల్చి సుఖంబునిమ్ము ꠋ భయహర! కృష్ణా! 56

క. నీవే కరుణించినచోఁ
బోవే కష్టంబులెల్లఁ ꠋ బూర్తిగ లయమై
రావే ననురక్షింపఁగ
నీవే నాదిక్కు మొక్కు ꠋ నిజముగఁ గృష్ణా! 57

క. గ్రహములు చాలనివేళల
గ్రహశాంతికి నిన్నుఁగొల్వఁ ꠋ గష్టము లుడుగున్
గ్రహముల కాధారుండవు
ఇహపరసౌఖ్యంబు లొసఁగి ꠋ యేలుము కృష్ణా! 58

క. భువి భాగవతాదుల నీ
సువినిశ్చలమహిమ లెల్ల ꠋ సూచింపఁబడెన్
భవసాగరమును దాటఁగ
భవదీయపదంబు నేను ꠋ బట్టితిఁ గృష్ణా! 59

క. బాధలలో నీ నామము
బోధకు రావచ్చు బాధఁ ꠋ బోఁగొట్టుకొనన్

సాధనగా నీ రూపా
రాధన మొనగూర్చుమా నిరతముగఁ గృష్ణా! 60

క. నరు లాత్మలాభపరులని
విరమించుచు వారిచెలిమి విబుధులు భువి నీ
చరణములఁ గొల్తు రటు నీ
శరణము సొచ్చెదను నన్ను సాకుము కృష్ణా! 61

క. పలుగతులు బ్రతుకుతెరువులు
గలవన్నిటిలోను జ్ఞాన గౌరవ సుఖముల్
గలిగించువృత్తిఁ గూర్పుము
గొలిచెద నీపాదములను గూర్మినిఁ గృష్ణా! 62

క. వ్యాధులు పలువిధములు భువి
వ్యాధికి మందులును వేలు వందలు నా కీ
వ్యాధులమందులఁ గలిగెడు
బాధలఁ దొలఁగింప నీదె భారము కృష్ణా! 63

క. చదివినది నేను గొంచెము
చదువులపారం బెఱుంగ శక్యంబగునే
చదువులమర్మము దెలియఁగ
సదయుఁడవై దారిచూపి సాకుము కృష్ణా! 64

క. తెలియుచు బుధులు చరింతురు
తెలియకఁ జెడుదు రిల మూఢ దీనజనంబుల్
తెలిసియుఁ దెలియనివాఁడ మొ
ఱలవిని రక్షింపుమిపుడు ప్రభువర! కృ. 65

క. మతభేదముచే మనుజులు
మతులను జెడఁగొట్టుకొనుచు మఱతురు నిన్నున్
సతతము నినుఁబూజించెదు
మతి నెప్పుడు నాకు నిమ్ము మఱవక కృ. 66

క. ఎన్నియొ జన్మములెత్తితి
నెన్నియొ యెత్తంగనుంటి నికమీఁదను నా
కన్నిట నీ నామము నెద
నెన్నుచు జపియించువరము నీఁగదె కృ. 67

—♦ శ్రీకృష్ణ మహిమ్నస్తోత్రము ♦—

క. మహిలోఁ గష్టము లుడుగఁగ
బహుభంగులఁ బాటుపడుచు బ్రతికెదుతఱి నే
నిహపరసాధనమగు నీ
మహిమను గనలేను గావుమా యికఁ గృ. 68

క. మనుజారంభము లెల్లను
గొనసాగును నీదుకరుణ కూడిన నని నే
విని నీదరిఁజేరితి నిపు
డనుకూలతఁ జూపికావు మనిశము కృ. 69

క. సురకిన్నర గంధర్వులు
సురరాజాదులును నిన్నుఁ జూడ నశక్తుల్
నరుఁడను దుర్బలుఁడను నీ
కరుణకుఁ బాత్రునిఁగఁ జేసి కావుము కృ. 70

క. బలవంతుని బలహీనులు
కొలుతురు తమకార్యసిద్ధికొఱకు నిజేచ్ఛన్
బలమవు బలవంతులలో
సలిపెద నీ సేవ, నిమ్ముసౌఖ్యముఁ గృ. 71

క. తెలివియు విద్యాధనములు
కలవని కడు గర్వమూని కడ కిప్పుడు నీ
బలమున్నఁజాలు నను మా
టల నిజ మెదఁ దలఁచి నిన్ను డాసితిఁ గృ. 72

క. పుట్టిన జీవుల కెల్లను
బెట్టుచు నన్నమును బెంచు పెద్దవు భువిలోఁ
బట్టెద నీ పదములు నను
గట్టిగఁ జేపట్టి వేగఁ గావుము కృ. 73

క. జలధిం దాగిన సోమకు
విలయముఁగావించి యఖిల వేదసమూహం
బుల వాగీశున కిచ్చితి
వలయక మత్స్యావతారమందునఁ గృ. 74

క. వరకూర్మమగుచు మందర
గిరిక్రిందున నిలువ జలధి గిరి కవ్వంబై
సురదైత్యులు చిలుకఁగ సుధ
సురలకు దివిజులకు బలము చూపితి కృ 75

క. మను వాదిని యజ్ఞముఁ జే
యను సూకరమగుచు బుట్టి యవనిని బైకిన్

ఘనముగఁ దెచ్చి హిరణ్యా
క్షునిఁ గూల్చినవేల్పవీవు । కూర్మినిఁ గృష్ణా ! 76

క. భూనభముల నడలించిన
దానవుని హిరణ్యకశిపు । దమియించి సుతున్
బూనికఁ బాలించుటకై
యానరసింహావతార । మైతివి కృష్ణా ! 77

క. అడిగిన భూదానము మూ
డడుగుల బలి యీయఁ బుడమి । యాకాశము రెం
డడుగులుగఁ బెరిఁగి బలిపై
నడుగిడి వామనుఁడవైతి । వయ్యా ! కృ. 78

క. తనతండ్రిమాట దాఁటక
తనతల్లినిగాచి సదయ । తన్ రాజుల నా
శనమునకుఁ బరశురాముఁడ
వను నవతారమ్ముఁ గొంటి । వయ్యా ! కృ. 79

క. రాముఁడు ! రవివంశాంబుధి
సోముఁడు ! సీతాహృదబ్జ । సూర్యుఁడు ! మేఘ
శ్యాముఁడు ! లంకాధీశవి
రాముఁడ వైనావు కావ । రమ్మిఁకఁ గృ. 80

క. రాముఁడవై కృష్ణాగ్రజ
తామహితుఁడవగుచు నఖిల । ధర్మవిదుఁడవై
భీమునకు గురుఁడవై బల
రాముఁడన జనించితీవె । ప్రాపయి కృ. 81

క. శ్రీవత్సాంక ! యదూద్భవ !
గోవర్ధనధర ! సునేత్ర ! గోపీలోలా !
శ్రీ విష్ణురూప ! వసుమతి
నీ వెప్పుడుఁ గావుమయ్య నెమ్మనిఁ గృ. 82

క. బుద్ధుఁడు జీవహితేషణ
బుద్ధిని బెంపొందఁజేసి భోగాసక్తిన్
బద్ధత జనులకు మాన్పిన
సిద్ధుఁడ వీ విడుము స్వేష్టసిద్ధిని గృ. 83

క. ఎవని నెవండును జూడం
డెవఁడు జగంబెల్లఁ జూచు నింద్రియసంఘం
బెవనివశంబై తగునా
భువనేశుఁడ వీవు సర్వమూలము కృ. 84

క. ఎవ్వనిచేఁ బుట్టును జగ
మెవ్వనిచే జగము వృద్ధి నింపుగ నొందున్
ఎవ్వఁడు లయకారణమగు
నవ్విభుఁడవు నీవెకావె ! అభవా ! కృ. 85

క. ఎవ్వఁడవస్థాత్రయమున
కవ్వల సాక్షిగను జూచునా యనుభవమున్
మవ్వముగ దెలుపు సంతత
మవ్విభుఁడ వనంగ నీవె యగుదువు కృ. 86

క. ఎవ్వనిచే వ్యాప్తము జగ
మెవ్వఁడు వేరుగను నిలుచు నీ జగమెల్లన్

ఎవ్వని మాయామయమగు
నవ్విభుఁడ వనంగ నీవె ♦ యగుదువు; కృ. 87

క. ఎవ్వాఁడు మూలము సృష్టికి
నెవ్వాఁడనాద్యంతమధ్యు ♦ డెవ్వాఁడు నిత్యుం
డెవ్వాఁడు తా నగు సర్వం
బవ్విభుఁడ వనంగ నీవె ♦ యగుదువు; కృ. 88

క. ఎవ్వనిగాల్పదు వహ్నియు
నెవ్వని శస్త్రములు కోయ ♦ విల పూడ్పగలే
దెవ్వని జలధులు నానుప
మవ్విభుఁడ వనంగ నీవె ♦ యగుదువు కృ. 89

క. ఎవ్వని సన్నిధివశమున
జవ్వన దేహేంద్రియములు ♦ చలనము నొందున్
ఎవ్వాఁడు గురులకు గురువగు
నవ్విభుఁడవనంగ నీవె ♦ యగుదువు కృ. 90

క. ఎవనిఁ గదల్పదు మారుత
మెవఁ డాకాశమున నిముడఁ ♦ డెవఁడు నబద్ధుం
డెవనిని గట్టదు కాలం
బవలోకింప నతఁడీవె ♦ యగుదువు కృ. 91

క. ఎవఁడు సదసత్తులకు వే
రెవఁడు శరీరాతిరిక్తుఁ ♦ డెవ్వఁ డబాధ్యుం
డెవఁడగు గుణాతిరిక్తుం
డవలోకింప నతఁ డీవె ♦ యగుదువు; కృ. 92

—♦ కృష్ణతత్త్వము ♦—

క. చట్టులు మూకుడు కుండలు
మట్టివి యైనట్లు చెప్పు ౯ మాటలభేదం
బెట్టులొ విషయంబులు తా
మట్టులె బ్రహ్మంబు నిజము ౯ నరయఁగఁ గృష్ణా! 93

క. సత్యము జ్ఞాన మనంతము
నిత్యము బ్రహ్మంబు వాక్కు ౯ నేరదు దెలుపన్
అత్యంతశక్తిమంతము
సత్యము వేదంబు దెలిపె ౯ సమముగఁ గృష్ణా! 94

—♦ సాధనచతుష్టయము - శమాదిషట్కసంపత్తి ♦—

క. చిత్తము సర్వము నీ కా
యత్తము చేయంగఁ జూడ ౯ నార్గురు రిపులున్
మొత్తముగ వత్తు రడ్డుగ
నిత్తఱి శరణంబవగుచు ౯ నేలుము కృ. 95

క. సాధనచతుష్టయము స
ద్బోధకు ముఖ్య మనినారు ౯ బుధవరు లిఁక నా
బాధల దునిమి శమాదుల
సాధింపఁగ నీయుమయ్య! ౯ సరగునఁ గృష్ణా! 96

క. క్రమత వివేకము వైరా
గ్యము శమషట్కంబు మోక్ష ౯ కాంక్షలు చూడన్
గ్రమముగ మోక్షప్రాప్తికి
నమరిన సాధనచతుష్ట ౯ యమ్మగుఁ గృష్ణా! 97

క. కనఁబడని బ్రహ్మసత్యము
కనఁబడు నీ జగము మిథ్యగాఁ దలపోయన్
ఘనులగు వేత్తలు దీనినె
యొనర వివేకమ్మటంచు నొప్పిరి కృ. 98

క. ఇలఁ గన్న విన్న యర్థం
బుల వాస్తవదృష్టి వాంఛఁ బొందమి దేహం
బుల బ్రహ్మవఱ కనిత్యత
దలఁచుట వైరాగ్యమనిరి తద్‌జ్ఞులు కృష్ణా! 99

క. శమమును దమమును శ్రద్ధయుఁ
గ్రమమున నుపరతి తితిక్ష గాఢసమాధా
నములను దెలుపుదు రార్యులు
శమషట్కంబనుచు నిది ప్రశస్తము కృష్ణా! 100

క. విషయంబులు దుష్టములని
విషమువలె న్విడిచి లక్ష్యవీథిని మనమున్
మిష లేక నిలుప శమమగు
విషధరశయనా! ప్రసన్నవేషా! కృ. 101

క. తమతమ నెలవుల నిలుపుట
విమలేంద్రియగణము నెల్ల విషయములందున్
గ్రమముగఁ బడి చెడకుండఁగఁ
దమమని తగఁ దెలిపినారు తద్‌జ్ఞులు కృ. 102

క. పరమార్థంబును దెలిపెడు
గురువాక్యార్థముల శాస్త్రగూఢార్థములన్

వరసత్యబుద్ధి దలఁచుట
స్థిరమతు లిల శ్రద్ధయనుచుఁ దెలిపిరి కృష్ణా ! 103

క. తాలో నెప్పుడు బాహ్యా
నాలంబనబుద్ధి వృత్తియై యుండినచో
నీలాలక ! యుపరతి యని
కాలోచితనామ మిడిరిగా మును కృ. 104

క. సహనముతో దుఃఖంబుల
బహుబాధలఁ బొందిన ప్రతిక్రతి చింతా
రహితముగ నోర్చియుండుట
మహిలోనఁ దితిక్షయనిరి మాన్యులు కృ. 105

క. బుద్ధిని బాగుగ నెప్పుడు
శుద్ధబ్రహ్మమున నిల్పి సువినిశ్చలతన్
బద్ధతయు లేక యుండుట
శుద్ధసమాధానమనిరి సాధులు కృ. 106

క. దేహంబు మొదలుకొని చి
త్తాహంకృతివఱకు బంధమమృతత్వముకై
సోహంభావసహిత ము
క్త్యాహను మోక్షేచ్ఛయనఁగ నొప్పును కృ. 107

—♦ అవ్యక్తస్వరూపము ♦—

క. పరమేశ శక్తిమాయయుఁ
బర మవ్యక్తం బనాది ఫలమున ననుమే
యరహస్యము నైతగు నీ
చరితము నేఁజెప్పుటకు నశక్తుఁడ కృ. 108

—◆ దేహవిభాగము ◆—

క. స్థూలము సూక్ష్మము కారణ
మీలాగున దేహభేద మేర్పడె స్థూలం
బేలాగున ముఖ్యంబన
గా లోభావనకు సాధకంబగు కృ. 109

క. శ్రవణాసుపాణిపంచక
ము వియత్పంచకము మఱియు బుద్ధ్యాదులు కే
శవ! కామకర్మమాయలు
భువి సూక్ష్మశరీరమనిరి పూజ్యులు కృ. 110

క. త్రిగుణాత్మక మవ్యక్తము
తగఁ గారణదేహమనిరి తద్జ్ఞులు నిద్రా
ప్రగతిని "నాకేమి తెలియ
మి"గనెద 'సుఖమయ్యె' ననెద మేల్కని కృ. 111

—◆ గుణవిభాగము ◆—

క. సుమతులు మూడుగుణంబులు
తమసును సత్త్వంబు రజము తగ న్యూనాధి
క్యమును గనె ననిరి ప్రార
బ్ధమున సుఖవ్యధల భేదబంధము కృ. 112

క. కేవల సత్త్వగుణంబున
భావములోఁ దృప్తి హర్ష పరమానందా
ర్ధావగతి శాంతిదాంతులు
జీవదయార్జవములును వసించును కృ. 113

క. రాజసపుగుణ విజృంభణ
మే జనులను దుఃఖముల న మితముగ ముంచున్
రాజిల్లును రాగంబు వి
రాజిలు విక్షేపమహిమ రయమున గృ. 114

క. తామసపుగుణ విజృంభణ
నే మన కన్యముగఁదోచు నీవస్తుచయం
బీమహినావరణంబని
వేమఱుఁ దెలుపుదురు బ్రహ్మ వేత్తలు కృ. 115

క. తనకొఱకె కాని విషయం
బున నుండదు ప్రేమ, యాత్మ మూలంబగుటన్
అనయము సర్వప్రియతమ
మని పలికిరి దాని వేత్త లరయుచుఁ గృ. 116

—♦ పంచకోశ వివరణము ♦—

క. అయిదువిధంబుల కోశము
లయి యన్నాసుమతి బుద్ధి హర్షములనగా
నయిదింటికి బ్రహ్మమువే
ఱయి తగు నిశ్చలతనుండు ననయము గృ. 117

క. అన్నమయకోశమెప్పుడు
నన్నముచే వృద్ధినొందు నన్నవిహీనం
బెన్నఁగ క్షీణించుఁ బురీ
షాన్నత్వఙ్మాంసాస్త్ర భరిత మయ్యది కృ. 118

క. ప్రాణముచే జీవించును
ప్రాణము లేకున్నఁ జావు ‡ పాలగు సుజనుల్
ప్రాణముఁ గర్మేంద్రియములఁ
బ్రాణపుఁ గోశంబటంచుఁ ‡ బలికిరి కృ. 119

క. మనమును జ్ఞానేంద్రియముల
ననిరి మనః కోశమనుచు ‡ నార్యులు ప్రాణా
త్మల జేరి యెల్లవేళల
ననువగు సంకల్పములకు ‡ నలవడుఁ గృ. 120

క. బుద్ధియు జ్ఞానేంద్రియములు
సిద్ధముగానున్న వస్తు ‡ సిద్ధికి లోనై
సిద్ధించును సంసారపు
బుద్ధియె విజ్ఞానకోశ ‡ ముగ నగుఁ గృ. 121

క. జాగరమునఁ గల లోపల
భోగముచే నల్పసుఖము ‡ బొందును, నిద్రన్
సాగు దమోగుణసుఖ మీ
బాగున నానందకోశ ‡ బంధము కృష్ణా ! 122

క. సర్వసమర్థుఁడ వెవ్వాడు
సర్వము నీయాజ్ఞచేత ‡ నవరింపఁబడున్
సర్వము నీలోనుండును
సర్వములో నుందువీవు ‡ సతతము కృష్ణా ! 123

క. పురుషుండు ప్రకృతి నీవును
సిరియుగదా దేవ ! మీదు ‡ సిరి కృపలే కీ

యిరువురశక్తులు గనుఁగొన
నెఱుకగలదె నాకుఁ జూడ నిత్తఱిఁ గృష్ణా! 124

క. అంతయు నీవై యుండఁగఁ
జింతలలోఁ జిక్కినట్లు చింతించెదు నా
స్వాంతంబున నజ్ఞానము
నంతయు లేకుండఁ జేయఁజూడుము కృష్ణా! 125

క. సాకారుండవు నీవు ని
రాకారుఁడవని వచింతు రాదిమహర్షుల్
సాకార నిరాకారపు
టాకారము నాకుఁ దెల్పవయ్యా! కృష్ణా! 126

క. అంతట నీవేయని ధీ
మంతులు చెప్పెదురు నీదు మహిమలు చూడన్
వింతలుగాఁ గన్పట్టెడు
నింతని తెలియంగవశమె యీమహిఁ గృష్ణా! 127

క. మాటలచేఁ దెలుపుటకును
తేటమది న్నేర్పుటకును దెలియనిదయ్యున్
దీటెనయని వేత్తలకును
బాటుపడిన దెలియు నీదుభావము కృష్ణా! 128

క. నాలోన నున్న నిన్నెద
నాలోకింపంగ లేక యటునిటుబయటన్
గాలమ్ము చాల గడపితి
నీలాలక! గావుమయ్య నిత్యముఁ గృష్ణా! 129

క. నిజమగు నిన్నెదఁ దలఁపక
భజియించుచునుంటి విషయవర్గ భ్రాంతిన్
సుజనాశ్రయమున నవవిధ
భజనల నినుఁగొల్చుచుందు భయహర ! కృ. 130

క. ఒకదాని నొకటి భువి పో
లక యగపడుఁ బెక్కురూపు లను గొన్నది నీ
వొకఁడవె యన్యము లేదని
సుకవులు నీమహిమఁజెప్పి చూపిరి కృ. 131

క. అణువునఁ బరమాణుండవ
గణిత మహత్త్వంబుకంటె గడు గొప్పవు ని
ర్గుణుఁడ వనంతుండవు నిను
గణుతింపఁగ నోపఁగలనె కావుము కృ. 132

క. కలవంటిది గద జగ మను
తలపు మనంబందు వేగఁ దగులమిచేతన్
నిలుకడలేక చరించితి
నిల నీవేదిక్కు నాకు నేర్పడఁ గృ. 133

క. ద్వైతమున నీవు నే న
ద్వైతమునను నీవె నేను ధరణి విశిష్టా
ద్వైతమున నీదుభాగం
బై తగ పూజింతు నిన్ను భవహర ! కృ. 134

క. హృదయమున బ్రహ్మముండును
ఎద నెప్పుడు దాన లీన మేర్పడజేయన్

ఒదవును నిత్యానందము
హృదనిలమే దారి తనకు నిల నగుఁ గృ. 135

క. నీకును నాకును భేదము
లేక జపింపంగ గలుగు లీనము నీలో
సేకురు బ్రహ్మానందము
వాకిలి ముక్తికిని తెరువ బడునటఁ గృ. 136

క. నామాదిరూపరహితం
బై మన నిదురకును బోలు భళిశూన్య బ్ర
హ్మమగు నవ్యక్తంబున
నీ మహ్యాదులకు జనన మేర్పడె గృ. 137

క. చేతనుఁ డంతట నిండుచు
నీ తనువున జ్ఞానరూపుఁ డిచ్ఛాచేష్టుం
డై తగ దేహత్రయసం
ఘాతముఁ గమనించు జీవగమనికఁ గృ. 138

క. విశ్వము సత్యంబగునెడ
శశ్వచ్చేతనుఁడు దేహ సంగతివలె నీ
విశ్వము నిదురను దెలియును
నశ్వరమేయగును గలల నాశము కృ. 139

క. మన సను పులి విషయము లను
వనమున నిలిచెఁ దాని లయము వారక జేయన్
తనుదానె సర్వమయుఁడై
ఘనమగు సత్యమును దెలియ గానగుఁ గృ. 140

క. ద్వైతమున భయము గలుగు న
ద్వైతమున నభీతిఁబొందు తనలో బయటన్
చేతనుఁ డొకఁడను ననుభవ
మే తగ నద్వైతమనిరి హితు లిలఁ గృ. 141

క. ప్రేయము శ్రేయం బనునవి
న్యాయముగ నవిద్య విద్య లయి చెలువొందున్
ప్రేయము సంసృతిబంధము
శ్రేయము మోక్షంబు తజ్జ్ఞ సిద్ధము కృ. 142

క. భానుని వేడికి పుట్టుచు
భానుని నేవిధము మేఘపంక్తులు మూయున్
ఆనందాత్మస్వాహంకృతి
తానుగ నాగతిని జృంభితంబగుఁ గృ. 143

క. జల ఘట రవి బింబముల వ
దలి రవి గగనమున జూడ దగినటువలె నీ
చెలువగు మతి విగ్రహ జీ
వుల వదలగ నిత్యుఁడాత్మ వెలుగును కృ. 144

క. ఆశలు పెంచ్చగు మోహపుఁ
బాశములను నేను కట్టఁబడిన కొలఁది నా
పాశంబుల విడదీయుచు
నాశరహిత ! సుఖము నిమ్ము నాకిఁకఁ గృ. 145

క. కొందఱికి ధనము సుఖమగుఁ
గొందఱికును వనిత సుఖము కొందఱకు సుతుల్

అందఱు నినుగన ఘనసుఖ
మందురు తత్సుఖము నీయ నడిగితిఁ గృ. 146

క. ధనవిషయకమగు భేదము
కనపడినను జనులకెల్లఁ గష్టంబు సుఖం
బనుభవమున నొకఁడే యని
నినుగొలిచెడి జ్ఞానమిమ్ము నిరతము గృ. 147

క. కామ క్రోధాదులచే
నామనసున నిన్ను మఱచి నాఁడను మఱి నీ
నామజపంబును మానితి
వేమఱు క్షమియింప నిన్ను వేఁడెదఁ గృ. 148

క. యుక్తిని నిను దెలియుటచే
ముక్తిని సాధింపఁగలరు మునివరు లిఁక నే
భక్తిని నిను సేవించెద
ముక్తినొసఁగి భక్తు నన్నుఁ బ్రోవుము కృ. 149

క. యమనియమాసనములచే
శ్రమపడుటకు దేహశక్తి చాలదు నీ నా
మమును బఠించుచు మ్రొక్కెద
మమకారముతోడ గావుమా నను గృ. 150

క. త్రాడును సర్పంబని తన
నీడను భూతమని యెండ నీరని భ్రాంతుం
డాడుగతి సత్యమనుకొని
నాఁడ జగంబెల్ల నిమ్ము జ్ఞానము కృ. 151

క. పాపము పుణ్యంబను నవి
లోపము లేనట్టి వేత్త లో నగపడవే
లోపములు లేనిగతి ననుఁ
బాపరహితుఁ జేయ నీదె భారము కృ. 152

క. తిట్టినఁ దిట్టకఁ గొట్టినఁ
గొట్టకఁ గోపింపఁ బరులు కోపింపక నే
గట్టిగ నీ పదముల నెరఁ
బట్టితి రక్షింపు మఘనివారక ! కృ. 153

క. నవరంధ్రంబుల దేహము
జవసత్త్వము లుడిగిచెడును జాడ్యాదులచే
భవభారముచేఁ గ్రుంగిన
నవినీతుని నన్నుఁగావు మా యిఁకఁ గృ. 154

క. దేహము గేహమువంటిది
దేహిని జీవుఁడను కర్మ తీవ్రతచే నా
దేహమె నే ననుకొనియెడి
మోహానుదొలగించి కాచు చుండుము కృ. 155

క. తననీడను బ్రతిబింబము
నను స్వాప్నిక దేహమందు నైజంబగు నా
త్మను గననటుల శరీరం
బును సహితం బాత్మ గాదు పొందుగఁ గృ. 156

క. సుగుణుండనో విగుణుండనో
యగణితజన్మములనెత్తి యల్లాడుచు నే

త్రిగుణములఁ గట్టఁబడితిని
త్రిగుణాతీతునిఁగ నన్ను - దేల్పుము కృ. 157

క. తొమ్మిదిత్రోవల జ్ఞానం
బిమ్మహా విషయములగలసి - యెద నిను మఱచెన్.
నెమ్మది నినుఁగొలిచెడి జ్ఞా
నమ్ము ప్రసాదింపుమయ్య! - నాకిఁకఁ గృ. 158

క. అజ్ఞానతిమిరభాస్కర
విజ్ఞానానందజనితవిభవము నొందన్
బ్రజ్ఞానఘనుఁడవగుటను
సుజ్ఞానము నాకు నిమ్ము - సురనుత! కృ. 159

క. నిలుచుచు నడచుచు నాడుచు
బలుకుచు నవ్వుచును వినుచు - బాడుచుఁ గనుచున్
బిలుచుచు నన్నియుఁ జేయుచుఁ
దలఁపఁగ నిను వరము నిమ్ము - తప్పకఁ గృ. 160

క. శమషట్కము వైరాగ్యము
విమలవివేకము సుబుద్ధి - వేత్తల సాంగ
త్యము నిలఁ బెంపొనరింపఁగ
నమరును గైవల్యముక్తి - యాత్మకుఁ గృష్ణా! 161

క. అహము మమత్వము నాశం
బహరహమును జేసి యాత్మయందే నిలువన్
బహువిధసంకల్పములకు
నిహతియు మోక్షమునువచ్చు - నిజముగఁ గృష్ణా!

క. కేవలశూన్యంబున జగ
మావిర్భావమును జెందెఽ నని తెల్పిన వాఁ
డే విగతిఁ నొందునని శ్రుతి
పై విధమును కరుణదెలియఁఽ బలికెను గృష్ణా! 163

క. పై విధముఁ దెలిపె వేదము
జీవు లనేకులును గనిరిఽస్థిరమోక్షంబున్
గావున భవాబ్ధి దాటం
గావలయు స్గురుకటాక్షఽకలనను గృష్ణా! 164

క. నిక్కముగ నిన్ను మదిలో
మ్రొక్కుచు నీ కృష్ణతత్త్వఽ బోధఁ బఠింపన్
చిక్కులు తొలగును సంపద
లెక్కువగాఁ గలిగి సౌఖ్యఽ మేర్పడుఁ గృష్ణా! 165

క. భారతభూమిని కృష్ణా
తీరమునను నాంధ్రదేశఽ తిలకంబగు గుం
టూరను నుత్తమమండల
మారయ నా జన్మభూమిఽ యందురు కృష్ణా! 166

క. కుచ్చళ్ళపాడు గ్రామము
పుచ్చా వంశమును గౌతఽముని గోత్రమునన్
మెచ్చగ విబుధులు పుట్టితి
నిచ్చి సుఖంబులను నన్నుఽ నేలుము కృష్ణా! 167

క. అస్వార్థులు శుభగుణ యో
గ స్వాంతులు నై వెలుంగుఽ కనకాంబా రా

మస్వామిశాస్త్రులకుఁ దే
జస్వుల కాత్మజుఁడ నన్ను ♦ సాకుము కృష్ణా ! 168

క. కవివరులు మెచ్చ నే నీ
భువి వేంకటకృష్ణశాస్త్రి ♦ భూసురుఁడను నా
యవినయముల బాటింపక
కవితాప్రియ ! నన్ను వేగఁ ♦ గావుము కృష్ణా ! 169

క. జ్యోతిష సంస్కృతముల సం
గీతమున పరిచయము గలిగ♦గించితివి గదా !
భూతలమున 'బీ. యే' నై
ఖ్యాతిని నీ దయను నేను ♦ గాంచితిఁ గృష్ణా ! 170

క. ఎద మర్మముఁ దెలియుటకై
పదపడి 'బీ, యీాడి' నైతి ♦ ఫస్టుగ్రేడున్
చదివితి విసివితి, సమ్య
గ్విదునింగా నన్ను జేయ ♦ వేడితిఁ గృష్ణా ! 171

క. ప్రజలు శుభంబులఁ గాంచుత !
ప్రజలకు హితముగను రాజు ♦ పాలించుత ! భూ
భుజులెల్ల మైత్రి నలరుత !
భజియించుత ! జనులు నిన్ను ♦ భక్తిని గృష్ణా ! 172

తత్సద్బ్రహ్మార్పణమస్తు

కృష్ణతత్త్వ శతకము సంపూర్ణము

---